శ్రీ

# ఉత్తరకుమారప్రజ్ఞ.





గ్రంథకర్త

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

శ్రీ

# ఉత్తరకుమారప్రజ్ఞ.





ఇది

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి ప్రణీతము.




మొదటికూర్పు.

౧౯౧౫.

రాజమహేంద్రవరము.

శ్రీ విద్యానిలయ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

# పీఠిక



ఇది యొకప్పుడు వినోదార్థము భారతము నుండి గ్రహించి వచనముగా వ్రాసితి ననుటకంటె దీనిని గుఱించి విశేషించి వ్రాయ వలసిన యగత్యములేదు. నా యందలి యవ్యాజ స్నేహ వాత్సల్యంబున దీనిని ముద్రింపించిన నా మిత్రులు, నాంధ్రభాషాపోషకులు నగు మ. రా. శ్రీ దామెర పార్థ సారథి వేంకట రావు గారికి నితో పృథి కై శ్వర్యాభి వృద్ధిగా నాశీర్వదించుచు నింతటితో విరమించు చున్నాడను.

పొలమూరు.

ఆనంద మాఘ శు ౧ శని వారము.

(౨౩ - ౧ - ౧౯౧౫)

ఇట్లు

విధేయుఁడు

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# ప్రకటన

---

| | |
|---|---|
| వారకాంతనాటకము. ... ... ... | ౦—౪—౦ |
| రామదేవవిజయము. ... ... ... | ౦—౬—౦ |
| సాహసికరాజపుత్త్రిము ... ... ... | ౦—౬—౦ |
| పాణిగృహీతాశ్రవణానంద శృంఖల (విమర్శ గ్రంథము). | ౦—౬—౦ |
| మిథునానురాగము (నవల). ... ... | ౦—౮—౦ |
| మోహాలేఖ. ... ... ... ... | ౦—౦—౬ |
| జలక్రీడ. ... ... ... ... | ౦—౦—౬ |
| ఉత్తరకుమారప్రజ్ఞ. ... ... ... | ౦—౧—౦ |

వలయువారు:—

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

పొలమూరు,

అనపర్తిపోష్టు,

గోదావరిజిల్లా, అని వ్రాయవలెను.

శ్రీరస్తు

# ఉత్తరకుమార ప్రజ్ఞ



సూర్యోదయకాలమున, ద్రోణ, భీష్మ, కర్ణాశ్వత్థామాది మహాయోధశిఖామణులచే విరాజిల్లు దుర్యోధనచక్రవర్తి యఖండసైన్యము సమదెంచి మత్స్యనగరమునకవతలి సూరమునన్న విరాటుని పశుగణంబులను బొదివిపట్టెను. మహాసాగరమువోలెఁ బొంగి పొరలిపోవుచున్న యాపౌఁజునాక్రమణమునుండి పశుగణంబులను మరలించుకొని పోవుటకుఁ బసులకాపరులు ప్రయత్నించిరి గాని లాభములేదయ్యె. కృపాశ్వత్థామశకునిదుశ్శాసన కర్ణవికర్ణదుర్ముఖ ప్రముఖులగు మహావీరు లనర్గళంబగు శరవర్షమును గురిసి యావెట్టిగొల్లండ్రఁ జీకాకుపరిచిరి. గోపాలురప్పుడవి దుర్యోధనుని బలమని తెలిసికొనిరి. వెంటనే యీవార్త రాజునకెఱింగింప గవాధ్యక్షుండు రథంబు నధిరోహించి యతివేగమునఁ బట్టణమునకువచ్చెను.

విరాటుఁడప్పుడు నగరమునలేఁడు. దక్షిణగోగ్రహణము గావించిన సుశర్మను జయించుటకుఁ బూనిన సమస్తవీరులను వెంటఁబెట్టుకొని యాతఁడాహవమునకుఁబోయియుండెను. ఇఁక నగరున నొక్కయుత్తరకుమారుఁడు మాత్రముండెను. అతఁడైనను రాణివాసమున స్త్రీజనసమక్షంబున నుండెను. అదివిని గవాధ్యక్షుండు తిన్నఁగ నటకరిగి యుత్తరుఁజూచి సంభ్రమముతో నిట్లనియెను. "యువరాజా! అనంతమగు దుర్యోధనుని సేనాసముదయము భూమిగ్రక్కదలఁ జనుదెంచి గోవర్గమును బట్టుకొనియెను. వానిని మరలించుకొని వచ్చుటకు బయల్వెడలుము. అనివార్యంబు నీయశక్తి పరాక్రమంబు వెలయ శత్రుభూపాలురను దీక్ష్ణశరంబుల పాలుసేయుము. వేగముగ రథము సాయత్తంబు సేయింపుము. అభేద్యంబగు కవచమును ధరింపుము. విల్లంబులు, గదాదండము, తోమరము, చక్రము, మున్నగు సకలాయుధంబులను దెప్పింపుము. యోధాగ్రేసరచక్రవర్తియగు నీతండ్రి విరటుండు సకలజనసమక్షంబున నిన్నెప్పుడు "నఖండదోస్సారసంపన్నుఁడు, నిస్తులశౌర్యశాలి, కులాలంకారుఁడు, అనంతభూభరణచణుఁడు

ప్రజాతపఃఫలస్వరూపుఁడు, దీనబంధు '' వని కొనియాడుచుండును. ఓకుమారమహీపతీ! నీజనకుని యగ్గింపు నన్వర్థము సేయుము. లెమ్ము.''

గవాధ్యక్షుఁడు స్త్రీజనంబుమధ్యంబుననున్న తన్నట్లు పెద్దసేసి కొనియాడుటచేఁ బొంగిపోయి యుత్తరకుమారుఁడు దర్పోద్ధతుఁడై లేచి నిలువంబడి చేయెత్తి "యేమీ కౌరవులు మనగోబృందమును బట్టుకొనిరా? కానిమ్ము. నేనిదే బయలుదేఱి గాంధారేయులకు శృంగభంగము గావించి ముహూర్తమాత్రమున మనగోసహస్రమును మరలించుకొని వచ్చెదను. కాని నాకుఁదగిన సారథిలేమింజేసి వగచుచున్నాను. వెదకుఁడు. ఎందైనఁ దగుసారథి దొరకెనేనిఁ దీసికొనిరండు. కౌరవులం బ్రోలుఁదోలు టెంత?'' యని పలికెను. అక్కడనే యుండి యదంతయు వినుచున్న సైరంధ్రి మెల్లగ నేగి యావృత్తాంత మర్జునునకుఁ దెలిపెను. అతఁడు నదివిని మిగులనలరి, యజ్ఞాతవాససంవత్సరం బతీతం బగుట యెఱింగించి "మనబృహన్నలకు సారథ్యము సేయ నేర్పుగలదు. అతఁడు తొల్లి ఖాండవదహనావసరమున నర్జునునకు సారథ్యముసేసి మెప్పుగొనినవాఁడు. వానిసాహాయ్యంబున నిరపాయంబుగఁ గురుసైన్యమును జయింపవచ్చునని చెప్పి యెట్లయిన నన్నాతఁడు సారథ్యమునకు నియోగించునట్లు సేయుము'' మని చెప్పి యామెనంపివైచెను. అంత సైరంధ్రియు నుత్తరచెంతకరిగి "యిదిగో వినుము. నాకుఁ దెలిసినది చెప్పవలయును గనుకఁ జెప్పుచున్నదాన. మనబృహన్నల చక్కగ రథము నడుపఁగలఁడుసుమా! ఖాండవదహనసమయంబున నర్జునునకు సారథ్యముచేసినవాఁ డాతఁడే'' యని మెల్లగ మనసునకెక్కునట్లు చెప్పి యానవిపించి యుత్తరునకాసంగతి నెఱింగించెను. అది విని నగుచు సైరంధ్రితో నుత్తరుఁడిట్లనియెను.

"అన్నా! ఏమిపలికితివి? సైరంధ్రీ! నన్నిట్లపహసించెదవేల? నపుంసకునిఁ గన్నులారఁ జూచుటకైన రోయువాఁడ సారథ్యము సేయ నెట్లనుమతింతును? అదియుఁగాక; గోవులంబట్టిన వారఖండబలులగు కౌరవులు. వారిని నిర్జింపవలసినవాఁడ నసమానబాహుబలంబు, ననివార్యశౌర్యమునుగల భూమింజయుఁడ నగునేను; అట్టిచో బృహన్నల నాకు సారథియైనఁ బురజనులు పకపకనవ్వరా?''

ఇదివిని "యుత్తరా! నీవట్లు దలంపఁదగదు. ఒక్కకౌరవసేనమాత్రమే గాదు ముల్లోకంబులు నెత్తివచ్చినను బృహన్నల నీకు సారథ్యము సేయునెడ నీకెంతమాత్రము నపాయము రాఁజాలదు. అతనిలావు నేను మున్ను చూచితిని. కారణాంతరములచే శరీరము వికారమైన నంతమాత్రమునఁ బరాక్రమమున కేమిలోప'' మని సైరంధ్రి యాతనినెట్టి

లేని సమాధానపెట్టెను. మఱియొకఁడెవ్వఁడును ... కంగీకరింపక తప్పినదిగాదు. అన్న యనుమతినడసి యుత్తర బృహన్నలం దీసికొనివత్తునని గజగమనయై నర్తనశాలకరిగి, వినయము దలకొత్త « మున్నొక పోరున నాసోదరుని సారథి మరణించెను. తిరిగవాఁడు లేమింజేసి మఱియెవ్వని నంగులకు నియమింపలేదు. గురూత్తమా! నేఁడు కౌరవు లత్యుద్ధతులై దండెత్తివచ్చి మాపశులంబట్టికొన్నారని వార్త వచ్చినది. పశులను మఱలింపఁ దలంపుఁగొని సారథిలేమి నాయన్న విచారించెను. సైరంధ్రి నీవందుఁ జాల నేర్పరివని చెప్ప నల్లియుని నీకడంగల చనవుననంజేసి తప్పక నిన్నొప్పించి వచ్చెదనని చెప్పివచ్చితిని. నీవెల్లయిన నీయాపదఁ దొలంగింప వలయు" నని ప్రార్థింప బృహన్నల నగి «రాజపుత్రీ! వింతమాటలాడుచుంటివేల? నేనెక్కడ సారథ్యము సేయుటెక్కడ? అయినను నీయాజ్ఞాబలంబు కలిమి నేనేకార్యమైన నెఱవేర్పఁగలను. నడువు" మనిచెప్పి మత్తశుండాలమువోలె బయల్వెడలెను.

ఉత్తరుఁడును వచ్చుచున్న బృహన్నల నల్లంతదూరముననే గాంచి గౌరవముతోఁ « గౌరవులతో నాకిప్పుడు పోరవలసివచ్చినది. నేఁడు నీవు రథము గడపవలయు, వేగ రమ్ము. కవచముధరించి రథమెక్కుము. సైరంధ్రివలన నీబలపరాక్రమములు మాకుఁ దేటతెల్లంబుగఁ దెలిసినవి. జాగు సేయకుము" నఁ జిరునగవుతో « భూమింజయా! ఆడుటకో, పాడుటకో పిలువఁదగినవానిని యుద్ధమున సారథ్యము సేయ రమ్మనుట చిత్రమా? బాగుగా విచారించి యీపనికై ప్రతాపమహితుఁడగువానిని నియమింపుము. అభీష్టసిద్ధిం బడయు" మని బృహన్నల ప్రత్యుత్తరంబిచ్చెను. అది విని యుత్తరుఁడు «బృహన్నలా, ఖాండవదహన సమయంబున నింద్రనందనునకు జయము నొడఁగూర్చిన నీతెలివి తేటలును, బాహుబలంబును నేఁడు మాసిపోయెనా? నాయెడల స్నేహము పాటించి మాఱుపల్కక యుద్ధప్రయత్నము గావింపు" మని బలవంతపెట్టెను. బృహన్నల యాతని మాటలకడ్డము సెప్పుటకు భయమందినట్లు నటించి యెట్టకేల కంగీకరించుటయు నుత్తరుఁడు మిగుల నానందించి బృహన్నల కొక దృఢకవచమును దీసికొనిరా నొకరులకాజ్ఞాపించెను. వెంటనే పోయి భృత్యుఁడు కవచమును దెచ్చి బృహన్నలకీయ నాతఁ డిదియెన్నఁడును గనవమన నెట్టిదో యెఱుంగనివాని పోలికిఁ దల్లవోయిచూచుచు నొకటి రెండు తడవలటుత్రిప్పి మీఁదఁ గప్పికొనియెను. అదిచూచి యచ్చటి స్త్రీజను లెల్లరును బక పక మనినవ్వసాగిరి. ఆలస్యమైపోవుచున్నదని తొందరపడుచున్న యుత్తరుఁడు స్వయముగ బృహన్నలకుఁ గవచములొడిగి వేగముగఁబోయి ధ్వజము నలంకరించి రథమునకు గుఱ్ఱము

లంబూనిచి తీసికొనిరమ్ము. పురజనులెల్లరు నానందింప నేఁడు కౌరవసైన్యమును జయించి రావలయు'' ననియెను.

అదివిని బృహన్నల ''యోధవీరశిఖామణీ! నేను నీవు చెప్పినట్లు సేయఁగలదాను. నీవున్నయెడ నుండవలయును. నీవు పోయినదెసఁ బోవలెను. నాశక్తిసామర్థ్యముల నెఱింగి, తగుపనులకు నియమించి విజయము గైకొను''మని చెప్పి రత్నమయంబగు సింహకేతనముచే నలంకరింపఁబడిన కాంచనమయంబగు రథమును దోలుకొనివచ్చెను.

ఇట్లనంత సన్నాహములతోఁ జనుదెంచిన సారథి నాగసి యుత్తరయు, నామె చెలికత్తెలును ''కౌరవులనుజయించి వారి వస్త్రములలో విచిత్రములైనవానిని మాబొమ్మపొత్తికలకుఁ దెం''డని కోరిరి. ''ఓకన్యామణులారా! కుమారమహీపతి యఖండమగు గాంధారేయుల సైన్యము నోడించుటకై బయలువెడలెను. ఇఁక మీకోరిక సిద్ధించుటెంత? తప్పకుండ మీరుకోరినట్లు చీరెలను దీసికొని వచ్చెద''నని చెప్పి నొగ లెక్కెను. వెంటనే యుత్తరకుమారుఁడు సింహకిశోరము మాడ్కి ధనుస్తూణీరము ద్గరాది వివిధసాధనంబులచే విరాజిల్లురథము నధిరోహించెను. అంతఁ బౌరవృద్ధపుణ్యాంగనా భూసురసమూహంబులు బృహన్నలంగాంచి తొల్లి ఖాండవదహన కాలంబున నర్జునకు నీకతంబున నెట్టిమాంగళ్యంబొడవెనో యట్టిమాంగళ్యమే నేఁడు నీసాయంబున నుత్తరకుమారునకుఁ జేకుఱుఁగాత'' మని దీవించి సేసలు సల్లుచుండ నవక్రపరాక్రము ధారేయుఁడైన యర్జునుని చాతుర్యంబువలన సల్గదశ్వంబగు రథంబు కన్నులపండువుగా బయలుదేఱి పురంబు నిర్గమించి పితృవనము దిక్కుగాఁ జనియెను.

పరేతనిలయ ప్రాంతమున కరుగునప్పటికి నాలమందను ముందిడికొని తత్ఖురసహస్రహతిచే రేఁగినపరాగ ముదగ్రమై దిగంతరాళంబులు గ్రమ్మ నరుగుచున్న గంభీరంబగు కౌరవసేన వారికిఁ గాన్పించెను. తోడనే యుత్తరుని మేను గరుపాఱెను. మనస్సు జల్లుమనియెను. మూపులు గిచ్చపడెను. మీఁదిప్రాణములు మీఁద నేయెగిరి పోయెను. కొంత తడవట్లు నిశ్చేష్టుఁడై పిదపఁ దెలివొంది మేనుగడగడ వడంకఁ దొట్రుపడుచు దిగులుతో ''బృహన్నలా! భీష్ముఁడు, ద్రోణుఁడు, కృపుఁడు, నశ్వత్థామ, దుర్యోధనుఁడు మున్నగు యోధాన యోధులకూడికచే దుర్నిరీక్ష్యమై, వీరభటుల ప్రచండ మండలాగ్రదీధితులచే మిఱుమిట్లు గొలుపుచు, నపారమును, గంభీరమునునగు నీచతురంగ బలంబుఁజూడ నాగుండె నీరయిపోవుచున్నది. బాలుఁడను; ధనుర్వేద మర్మములను జక్కఁగ నెఱుఁగనివాఁడను, నగునేను మహానుభావులగు కౌరవవీరుల నెదిరింపఁగలనా?

సంగతిసందర్భము లేమియు నాలోచనసేయకుండ వచ్చితిమి. కౌరవసేనం జూడఁగనే మనస్సుతోఁగూడ శరీరమును వడఁకిపోవుచున్నది. ముందువెనుక లాలోచింపకయే నీవూరక రథము తోలుకొని పోవుచున్నాఁడవు. ఇఁక నేనేవిధంబునఁ జూచినను వీరినెదిరింపఁ జాలను. ఓయీ! నీకుఁ బ్రాణములమీఁద దీపిలేదా? వేగ రథము మరలింపు'' మని యుత్తరుఁడు బృహన్నలం దొందరపెట్టసాగెను.

ఉత్తరుని తత్తరపాటు నరసి బృహన్నల నగుచు "భూమింజయా! ఏలనీకీవెఱ్ఱి? కౌరవుల బలాబలంబులు నేనెఱుంగనిదియా? అత్తుచ్ఛసైన్యము నోడించి యాలమందను మరలింపకుండ మగిడిపోవుట తగునా? అంతఃపురంబున స్త్రీలెల్లరు నత్యానందమునంద నేనిదేపసులఁ దెచ్చెదనని బీరములు పలికి మహాయోధునివలె నరదమెక్కి నేఁడిట్లు రథగజతురంగాదులం జూచినంతమాత్రమునఁ గలఁగిపోవుట తగునా? యని ధైర్యముగలుగఁ బలికెను.

ఉత్తరుఁడు—పసులసంగతి దైవమెఱుంగును. పడఁతులసంతోషముతో నాకుఁ బనిలేదు. తేరుమరల్పుము.

బృహన్నల—శక్తికొలంది భుజాదర్ప మేర్పడఁ బోరుట శూరలక్షణము. ఇట్లు పాఱిపోయిన లోకులు నవ్వరా? ఇంతవఱకు రిపుసేన నిన్ను జూచనైనలేదు. నీకు భయహేతు వేమి?'' ఇట్లు చెప్పుచు నాతఁడరదముఁ దోలుచునే యుండెను. మఱియు నిట్లు చెప్పెను. "గర్జనిర్ఘోషకంబులగు వైరివీరుల శంఖారావములకు బెదరక; సేనలదురితగమనంబులచేఁ బెల్లుబరి ధూళికాఱుమబ్బులవోలె నంధకారము గలిగింప వెఱవక, చతురంగబలముత్సాహవృద్ధితో వచ్చితాఁకిన జడియక, శస్త్రాస్త్రములు రథికులయొక్కయు, సారథులయొక్కయు గవచములను, శరీరములనుజించుచుఁ జనకక, రొమ్మిట్టి యిక్కట్టులు వాటిల్లినను ధైర్యమ్మున శత్రువుల కెదురొడ్డినిలిచి పోరిన బౌరుషము గాని యిట్లుసేయఁ జూచుట హాస్యాస్పదము గాదా?

ఉత్తరుఁడు—మహోద్దండపరాక్రమముతో వచ్చి త్రిగర్తసైన్యములు దక్షిణ గోగ్రహణము సేయువారిని జయించుటకు మజ్జనకుండు పురమున్న వీరవరేణ్యుల సందఱం బురస్కరించుకొని సైన్యము నంతను వెంటఁ బెట్టుకొనిపోయెను. ఇఁక నాకు సాయము సేయఁదగినవారు పురమున నెవ్వరును లేరు. నేనొక్కఁడ నీకురుసైన్యము నెదిరింపఁ గలనా? ఈవెఱ్ఱిమాటలేల? వారు చూడకముందే రథము వెనుకకుఁ ద్రోలుకొని పోవుటయే నీతి.

బృహన్నల — ఆఁడుదానివలె నీవిప్పు డూరక మగిడిపోయినచోఁ బగతురు నవ్వరా? నీ వేమో మహావీరుఁడవనియు, సారథిగా నిను నిరీక్షించుమంటివనియుఁ జెప్పి సైరంధ్రి నన్నీచేతగానిపనికిఁ బ్రోత్సహించినది. నీవుగూడ నిఁక నిలువరాదని నన్ను గడుఁ దొందరపెట్టితివి. వచ్చినవారము రానే వచ్చితిమి. గోవర్గమును మరలింపకుండనే యూరక మరలిపోదునా? నీవు భయము దక్కి యుండుము. మనస్సు చిక్కఁబట్టుము.

ఇట్లుత్తరునకు సమాధానము చెప్పుచున్నను నర్జునుఁడు రథము నడుపుట మానలేదు. అది చూచి యుల్లము పెల్లుగఁ దల్లడిల్ల బెదరుచు నుత్తరుఁడు "మగిడిపోయినం బౌరులు నవ్వెదరా? అయినఁ గానిమ్ము. నీ కంత కోర్కె యుంటివేనిఁ గౌరవులను నీ వెదిరింపు" మని చెప్పి శరశరాసనంబుల రథముపై నిక్షేపించి గుభాలున నుఱికి వెనుకకుఁ బాఱిపోఁ జొచ్చెను. తోడ్తో బృహన్నలయు నుత్తరునిం బట్టి తెచ్చుటకుఁ దేరునుండి క్రిందికి లంఘించి పఱువసాగెను.

ఆసమయంబునందే కౌరవులు వెనుదిరిగి చూచుట తటస్థించెను. వారిలోఁ గొందఱు బృహన్నల వికృతవేషము నారసి నవ్వసాగిరి. మఱికొందఱు పార్శ్వస్థు లాతని బాహువుల దైర్ఘ్యమును, శరీర సౌమ్యతయుఁ, వీరతేజంబును కుంజర దుర్లభగమనంబు నారసి, "యీవ్యక్తి యాఁడుచందంబును బురుషరూపంబులు గూడఁ గలిగి నివురుగప్పిన నిప్పువోలె వెలుంగుచున్నది. చక్కఁగఁ జూడ నావ్యక్తి యర్జునుఁడని తోఁచుచున్నది. అతఁడు తన దివ్యతేజము బయల్పడకుండునట్లు పేడిరూపము దాల్చి విరటునిఁ గొల్చుచు నుండియుండెను. అర్జునుఁడే కాకున్న నిప్పుడీకురువీరులం దాఁక రా సాహసింపఁ గలఁడా? దక్షిణగోగ్రహణము గావించిన సుశర్మను జయించుటకు విరాటుఁడు పురమునఁగల సమస్తవీరులను వెంటఁబెట్టుకొని పోవుటచే సారథ్యము సేయుటకుఁగూడ మఱియొకఁడు లేమి నుత్తరుఁ డర్జునుని వెంటఁబెట్టుకొనివచ్చి యుండును. అతఁడు తన సారథి బలపరాక్రమములం గుర్తెఱుంగమినట్లు మనలం జూచినంతనే పాఱిపోవుచున్నా" డని యనుకొనఁ దొడఁగిరి. ఇంతలో నర్జునుఁడు, పఱువెత్తుకొనిపోవుచు నూరడుగుల దూరముననున్న యుత్తరు నొడిసిపట్టుకొని రా సాగెను. అప్పు డుత్తరుఁడు గడగడ వడంకిపోవుచు "బృహన్నలా! నన్ను విడువుము. నన్ను దయతో రక్షింపుము. అట్లు గావించెదవేని నూరు బంగరుకాసులును, నిర్మలోజ్జ్వలంబులగు నెనిమిది వైడూర్యంబులును, మంచిగుఱ్ఱములు పూన్చిన రథంబును, మదించిన పది యేనుఁగులును, నొక గ్రామమును బురము జేరినవెంటనే యిచ్చెద. నాతల్లి నాపై నెంతో ప్రేమ చూపు

ముండును. ఆమె నాకొఱ కెంత బెంగటిల్లియున్నదో; బృహన్నలా! ఇఁక మాయమ్మను జూచుభాగ్యము లేదు గాఁబోలు. అయ్యో! నన్నుఁబోని'' మ్మని రోదనము సేయ సాగెను.

అప్పు డాతని నూఱడించుచు బృహన్నల "యుద్ధము సేయుటకు నీవు చాలవేని నేనిఁక సారథ్యము సేయుదును. కౌరవసైన్యమెల్ల నేన నుగ్గుచేసెద. ఆలమందలు మరలించెద'' నని యెట్టకేని నుత్తరు నొప్పించి తత్ప్రాంతంబునంగల శమీవృక్షసమీపమున కదరథముఁ దోలించుకొని పోయెను. అయ్యెడఁ "గ్లీబరూపచ్ఛన్నుం డయ్యును బ్రస్ఫురణవిశేషభీషణుండగు'' నర్జునుం గాంచి కౌరవసైనికులు నివ్వెఱపడియుండ వారలం జూచియుఁ దమకుఁ దోఁచు నుత్పాతంబుల నాలోకించియు "ననిమిత్తంబులగు నుత్పాతంబులు తోఁచుచున్నవి. యుద్ధమునకు సర్వసిద్ధముగ మోహరములు పన్నుఁడు. శక్తి యున్నంతవఱకు జాగ్రత్తగఁ గాచికొనుఁ''డని చెప్పి తా నర్జును నెఱింగినవాఁడుగావున నాతని కజ్ఞాతవాసభంగం బగునేమోయను భయంబున భీష్మునింజూచి సన్నసన్నముగ "నర్జునుం డనాలోచితముగ నేపనియుంజేయఁడు. నేఁడు కయ్యమునకు డీకొని వచ్చుచున్నాఁడు. దేహలక్షణములం జూడ దేవేంద్రునివలెఁ దోఁచెడిని. వానియభిప్రాయమేమో తెలియకున్న''దనియెను. అది విని భీష్ముఁడు దుర్యోధనుం గాంచి యాతనితో మాట్లాడుచున్నట్లు నటించుచు "శత్రులకు ననుకూలములగు తావులకు వచ్చితిమి. మహాబలము చూపఁ దఱియైనది. మనకిఁక జంకు వల''దని నిర్ఘోషముగా గురునకుఁ బ్రత్యుత్తరం బిచ్చెను. ఆచార్యుఁ డా యుద్ధము నెఱింగి సంతసించి "మదించిన యేనుఁగు నరసిన యాఁకొన్న సింగమువోలికి మనలంగాంచి కాంతారవాస ఖిన్నమతియైన యర్జునుఁడు వీఁడె వచ్చె. ఈతని నెదిరింపఁదగినవాఁ డీసైన్యమునం గాన్పింపఁడు. విలాసముగ నర్జునుఁడు గోవుల మరలించుకొని పోవును. బాహుబలంబున నీశ్వరునింగూడ మెప్పించిన యీతని కొం డసాధ్యం బేమున్నది?'' యని పలికెను.

అది విని కర్ణుఁడు మిగులఁ గటకటంబడి "గురువరా! పాండవపక్షపాతంబునఁజేసి నీ వట్లు పలుకుచున్నాఁడవు. అనంతమగు నీకౌరవసేనయం దంతట నీవొక్కఁడవె మేటివా? అర్జునుఁడేమి యంతవీరుఁడేమి? అతఁడేవచ్చెనేని నేనొక్కఁడన వాని నెదిరించి యస్మత్తీవ్రశరపరంపరపాలు సేసి నిమిషార్ధమునం బొలియందోలెద'' ననియెను. అపుడు దుర్యోధనుండు "మిత్రమా కర్ణా! నీవు పొరఁబడితివి. అటవచ్చువాఁ డర్జునుఁడే యగునేనిఁ దిరిగి యన్నదమ్ములతోఁగూడఁ బండ్రెండేం డ్లడవికాపురంబు సేయవలసిన

వాఁడే. అట్లుకాకపోయిన యిప్పుడే శరవర్షము గురిసి జర్జరితాంగులం గావించి నేఁలు వ్రాఁగడ వారిం బాఱఁద్రోలెద''నని యుచ్చస్వరంబునం బలికెను. భీష్మాచార్యుఁడును, ద్రోణాచార్యుఁడును, కృపాచార్యుండును, నశ్వత్థామయు నప్పలుకుల నాకర్ణించి సంతోషము నభినయించిరి.

అట నర్జునుండు జమ్మిచెట్టుక్రింద రథము నవరోహించి యుత్తరుం గాంచి "యీ చెట్టుమీఁద గాండీవమున్నది. మద్భుజాబలంబున కది గాని యాఁగదు. తక్కినవన్నియు దానిముందు దివిటీ ముందటిదీపములువంటివి కావున నీ చెట్టెక్కి యాధనుస్సు నిటు తెమ్ము. పాండవులు తమ యాయుధంబులను గట్టకట్టి దీనిపైఁ బెట్టినారు. అందొక్క గాండీవము మాత్రము తీసి తక్కినవి మగల యథాస్థానంబున నుంపు''మని శవాకారంబుననున్న శస్త్రాస్త్రసమూహమును జూపెను. అది చూచి యుత్తరుఁడు శవముగా భావించి "పీనుఁగు నంటవచ్చునా? రాజపుత్త్రుఁడనని సందేహము లేక నన్నిపనికి నియమింపఁదగునా? పాపము గాదా?'' యని పలుక బృహన్నల మనుజులెవరు నంటకుండుటకై యట్లు కట్టఁబడినదే గాని యది పీనుఁగు గాదు. అట్టి యనిష్టంబులకు నియమింతునా? నామాట నమ్ముము. ఆలసింపకు'' మని యనేకవిధంబులఁ ద్వరపెట్ట నుత్తరుఁడు తుదకుఁ జెట్టెక్కి యాకట్టువిప్పి యాయాయుధకాంతులచే మిఱుమిట్లుగొని యందుఁగల యాయుధంబుల నన్నిటిని పేర్వేర వివరించి చెప్పుమన బృహన్నల యంతయుం జెప్పెను. అది విని యుత్తరుండు "కట్టా! ఈ యాయుధమ్ముల నన్నిట నిట్లు న్చటఁ బెట్టి మహావీరులు పాండుకుమారు లెచ్చటికిఁ బోయిరో కదా? నేను వారి మేనల్లుఁడను. ఆ యుధిష్ఠిరుఁ డెందున్నాఁడో; భీముఁడును బార్థుఁడు నేమాయెనో; కవలునకులసహదేవు లెచ్చటడాఁగినారో; కుసుమకోమలి ద్రౌపది యెందు వసియించుచున్నదో, వారసంగతి యేమియుఁ దెలియుటలేదు. వారినిగుఱించి యేమని వినవలసి వచ్చునో;'' అనుఁడు నర్జునుఁడు "వత్సా! వారికై నీవు వగవవలదు. సమయపరికారము వారు పండ్రెండేం డ్లరణ్యవాసము గావించి పదుమూఁడవయేఁ టజ్ఞాతముగాఁ గడపఁ బ్రచ్ఛన్నవేషులై మనపట్టణముననే యున్నారు. వారి నెఱింగించెద వినుము. కంకుం డను పేర నీతండ్రి నెచ్చెలియై యున్న యాతఁడే ధర్మరాజు. భీముఁడే వలలుఁడు. దామగ్రంథియను పేరున నశ్వపాలకుఁడై యున్న యాతఁడే నకులుఁడు. తంత్రీపాలుఁడను పేరుతోఁ గోపవేషంబుననున్న యాతఁడు సహదేవుఁడు. మాలినియను సైరంధ్రీవేషమున నున్నకాంత ద్రుపదరాజపుత్త్రిక యాజ్ఞసేని ఆమెకొఱకే గదా సింహబలుండగు కీచకుని

వానితమ్ములను గంధర్వులు సంపిరని భీముండు చంపె? ఇక దాపనేల? నేనే యర్జునుఁడ''నని పలికెను. అపుడని యుత్తరుండాశ్చర్యచకితుండై యాశ్చర్యశాలియగు నర్జునకుఁ బదిపేరులు గలవు. వానిం బేర్కొంటివేని యో బృహన్నలా! నిన్ను గిరీటియని నమ్మెద ననియెను.

అపుడు కుమారుని బృహన్నల యుత్తరునితో నిట్లనియెను. "అర్జునుఁడు ఫల్గునుఁడు, పార్థుఁడు, కిరీటి, శ్వేతవాహనుఁడు, భీభత్సుఁడు విజయుఁడు, జిష్ణుఁడు సవ్యసాచి, ధనంజయుఁడు'' అని నాకుఁ బదిపేళ్లుగలవు ఏయే కారణంబులచే నాకీపేళ్లు గలిగెనో నీవు సంకోచ లేకయే చెప్పెద వినుము ధరాతలంబంతయుం గెలిచి ధనముగొనుటచే నేను ధనంజయుండనైతి. సంగరములయందెప్పుడు నారథమునకుఁ దెల్లగుఱ్ఱములు గట్టఁబడుటచే శ్వేతవాహనుఁడనైతిని. దేవేంద్రునిచే నొసంగఁబడి బాలభానునివలె వెలుంగు కిరీటము నాశిరము నలంకరించుచుండుటం గిరీటినైతిని. ఎట్టివిపద సమయముల యందైన యుద్ధరంగమునుండి కదలక వైరివీరులకు భీతిని గలిగించుటచే భీభత్సుఁడనైతిని. గాండీవము నిరుగేల నాకర్షింపఁగలిగినను విశేషించి యెందు సవ్యకరమున నత్యంత నేర్పుతో నాకర్షింపఁ గలుగుటంజేసి సవ్యసాచి యనంబరఁగితిని. నిర్మలంబగు తెల్లనిదేహచ్ఛాయ గలవాఁడ నగుట నర్జునుఁడనైతిని. ఉత్తరఫల్గునీనక్షత్రమున జన్మించుటచే ఫల్గునుఁడనైతిని. నేఁజూచుచుండ దేవతలైనను ధర్మరాజు మేన నీషణ్మాత్రమైన గాయము సేయఁజాలరు గావున జిష్ణుఁడనైతిని. మాయమ్మ కుంతికిఁ బృథయను మాఱుపేరుండుటచే నేను పార్థుఁడనైతిని. కుమారా! సత్యమూర్తి ధర్మజుని తమ్ముఁడ నేనబద్ధమాడెదనా? ఖాండవవనము దహించినపుడు రుద్రుండును బ్రహ్మయును సాక్షాత్కరించి యప్రతిహత బాణంబులతోఁ బాటు కృష్ణుండను పదునొకండవ పేరుఁగూడ నొసంగిరి. వారియనుమతి నింద్రాది దేవతలనేక విధంబులగు దివ్యాస్త్రంబుల నొసంగిరి. అటుపిమ్మట దేవతలకుఁగూడ నజేయులగు నివాతకవచుల ను రాక్షసులను మాతలి సారథికంబగు నింద్రవరథం బధిరోహించి యొక్కఁడనే మూఁడుకోట్లను నిర్జించితిని. దుర్జయ్యాపరితాపులును హిరణ్యపుర నివాసులునగు నరువదివేవురు దేవారాతులను సముద్రతీరంబునం బరిమార్చితిని. అప్పుడే యింద్రుండు కిరీటంబును, దేవతలు శంఖంబు నొసంగిరి. అక్కతన నాశంఖము దేవదత్తంబనంబరఁగె. మున్నొకప్పుడొక గంధర్వరాజు దుర్యోధనునిఁ గట్టినప్పుడా గంధర్వుని జయించి దుర్యో

ధను బంధమోక్షంబు గావించితిని. ఇఁక నీకు సందియంబేల? ఈదుర్యోధనుండును దిక్కైన పెద్దలు నెంతవారు?

ఇదియంతయును విని యుత్తరుఁడు జమ్మిచెట్టుమీఁదనుండి గుభాలున నుఱికి బృహన్నలకు సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి నిలిచి చేతులు జోడించి "యోవీరాధివీరా! నీవు నాపై నిట్లనుగ్రహించుటం జేసి భాగ్యదేవత సాకారయై వచ్చినట్లయినది. నామది నావరించియున్న మోహము నాసినది. నీవిట్టివాఁడవని యెఱుంగక పలికిన నాపలుకులలో నేరములున్నచో క్షమించి నన్ను రక్షింపు" మని వేడుటయుఁ బ్రీతుండై యర్జునుం డాతనిం గౌఁగిటం బొదివిపట్టి లాలించెను. అంత ముదితస్వాంతుఁడై భూమింజయుఁడు "నే నర్జునునకు సారథ్యము సేయవలయునని యెల్లప్పుడుఁ గోరుచుందును. నేఁటి కది సిద్ధించినది. కాని పుంస్త్వాభరణా! నీకీషండభావం బెట్లొదవెఁ జెప్పు" మని యడిగెను. అనవుఁడు బృహన్నల "మాయన్న ధర్మజుని పంపున నొకయేఁడు బ్రహ్మచర్యవ్రత మాచరింపఁ బూర్వశాప ప్రభావంబున నీరూపు దాల్చితిని. ఒక్క సంవత్సరము పాలింపఁదగిన యీవ్రతము పదుల కిట్లు కానంబడుచున్న" దని చెప్ప సంతసించి యుత్తరుండు "నేనిప్పు డేమి సేయవలయు" ననియెను. గాండీవంబును గాంచనపుంఖంబులగు బాణంబుల తూణీరయుగళంబును దనుత్రాణంబును దీసి తక్కిన వెప్పటి యట్ల కట్టి రమ్మని చెప్ప నుత్తరుఁడు మరలఁ జెట్టెక్కి యట్లు గావించి వచ్చెను. పిదప నర్జునుఁడు వానిం గైకొని భక్తితోఁ బ్రార్థింప నిందుఁడిచ్చిన కుండలములును, నుష్ణీషమును సన్నిధి చేసెను. శిరోజములు నలుపడ ముడివైచికొనియెను. పసపుఁ దలపాగా మట్టి కుండలములు ధరించి కాసె బిగించి కరముల వలయంబులు దాల్చి మందహాసముతో రథ మధిరోహించి సకలసన్నాహములు గావించికొని గాండీవం బెక్కిడి గుణంబు సారించెను. ఘనాఘన గర్జారవంబును సిగ్గుపఱుచు నాధ్వని నాలించి పక్షిమృగజాతు లెల్ల బెదరి యిటునటు పఱవసాగెను. చెట్లు కదలిపోయెను. కురుబలంబులు తల్లడిల్లెను. దిక్కుహరములు ముఖరితములయ్యె. అర్జునుఁడు పిమ్మట నగ్నిదేవునిం బ్రార్థింప విశ్వకర్మ నిర్మితంబగు కపిధ్వజంబును దదధిష్ఠకంబులగు భూతంబులును జనుదెంచెను. అంత నుత్తరుని సింహపతాకము జమ్మిపైఁ బెట్టించి కపిధ్వజము నరదముపైఁ బెట్టించెను. అటుతరువాతఁ జిత్రజంబగు దేవదత్తంబు రాఁ బూనిని జేకొని రథము జమ్మికిఁ బ్రదక్షిణముగఁ ద్రోలి నియమించి శంఖముఁ బూరించె.

ఆగంభీరధ్వనిచే సప్తసముద్రములు కలఁగిపోయెను. సప్తకుల పర్వతంబులు నూటాడె. భూమి గడగడ వడంకెను. రథమునకుఁ గట్టిన గుఱ్ఱములు చాపఁ గట్టుగఁ బడియె. ఉత్తరుఁడు మూర్ఛిల్లె. అప్పు డర్జునుఁడు గుఱ్ఱంబుల వాగెలుపట్టియుత్తరు చక్కఁగ నిమిరి యుత్తరునకుఁ జైతన్యముఁ గలిగించి యనేకవిధంబుల నాతనిం బుజ్జగించి ధైర్యవంతుగాఁ జేసి మరల శంఖంబునొత్తి రథము నడిపింపఁ జొచ్చెను.

అటఁ గురుబలంబున నది ద్రోణాచార్యుఁడు చూచి దుర్యోధనునికభిముఖంబై "ఆగుణము మోఁత చెవులు చిల్లులు వోఁగొట్టుచున్నది. శంఖధ్వని బ్రహ్మాండభాండము బ్రద్దలుగావించి ప్రపంచము చైతన్యరహితము గావించుచున్నది. మహోగ్రంబగు కేతన మాకాశమెల్ల నలరించుచున్నది. కిరీటకాంతి కన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్నది. అంతియుఁ జూడ నాధనుస్సు గాండీవంబనియు, నాశంఖము దేవదత్తంబనియు, నాధ్వజము కపికేతనమనియు, నాకిరీటము దేవేంద్రునిచే నీఁబడినదనియు నావచ్చువీరుఁడు రిపుభీషణబాహుఁడగు బీభత్సుఁడనియుఁ దోఁచుచున్నది. ఇఁక మాటలతోఁ బనిలేదు. యోధానయోధులను బోరికి సిద్ధముసేయుఁడు." అని చెప్పి యశ్వత్థామాదులం గాంచి యుపాయ మూదనకుండ ముందు రాజును నడపనిచ్చి యాతనివెనుక వీరుల నుంపుఁడు. అట్లయిన నర్జును నెదిరించుటకుఁ జాల ననువుగ నుండుననియెను.

ఈమాటలపై వారిలోవారి కంతఃకలహములు గలిగెను. ద్రోణాచార్యుని దుర్యోధనుఁడును గర్ణుఁడు నధిక్షేపించిరి. దానిపై నశ్వత్థామ కోపపడియెను. పిదపఁ గర్ణాశ్వత్థామ లందుకొనిరి. తుదకీవివాదము చాలఁ దీర్ఘంబయ్యెను. అశ్వత్థామ "శిష్యానురాగమ్మున ద్రోణాచార్యుఁడు పోరినను నేను బోరఁజాల''నని చెప్పవైచెను. కడకీవాదం బెట్లో చల్లాఱుఁడుఁ బాండవుల కజ్ఞాతవాసదీక్ష కడచెనాయనునొకసందియము గలిగెను. భీష్మాచార్యుఁ డదివారించి "వచ్చినవాఁడు సవ్యసాచి. మనబీరము లేక సాగవు. కాచికొనుం''డని చెప్పెను. పిదప ద్రోణాచార్యుఁడు సేనావిభాగము గావించెను. ఆనియమప్రకారము నాల్గవపాలుబల మంగరక్షకముగా నేర్పఱిచికొని రాజు ముందుఁ బోయెను. ఆవెనుక నంతియసేన జుట్టుకొని కాపాడుచుండ గోగణంబు నిర్గమించెను. తక్కిన సైన్యము నటనట నుంచి యాచార్యుండు నడుమను, కృపాచార్యుండు వలపటను, నశ్వత్థామ దాపటను, కర్ణుఁడు ముందటను, వికర్ణ దుశ్శాసన శకుని సైంధవ సోమదత్త

బాహ్లీక భూరిశ్రవః ప్రముఖయోధులెల్ల నెవనెవం గలయనిలువ మహోత్సాహంబునఁ దాలధ్వజం బెత్తించుకొని భీష్ముండు వెనుకయై నడిపించుచుండెను.

అప్పు డవంశమగు నీసేనాసాగరంబునకును దనకుమారున కొక్కనికిని జరుగు నీ మహాయుద్ధముంజూడ దేవేంద్రుఁడు విమానము నెక్కి యాకసంబునకు వచ్చి నిలిచెను. ఆవిమానమునందు స్వర్గమునఁగల రాజులుఁ జక్రవర్తులును యథోచితముగ వింజామ రాదులం గయికొని దేవేంద్రునిఁ గొలుచుచుండిరి. పాండురాజు దేవేంద్రునిప్రక్క వేఱొక పెద్దగద్దెపై దేవతాస్త్రీలు వీవఁ పులిడుచుండ నాసీనుండై యుండె. ఆసమయంబున బ్రహ్మాండభాండము మార్మ్రోగునట్లు సింహనాదము గావించుచు నర్జునుఁడు హఠాత్తుగఁ గౌరవసైన్యముం దాఁకెను.

అప్పుడొకసారి యర్జునుండా గౌరవబలంబుం గలయంజూచి "యోధానయోధులును సామాన్యవీరులును, సకలసైనికులును విస్పష్టముగఁ గాన్పించుచునే యున్నారు గాని దురభిమానదూషితుండగు సుయోధనుండు కాన్పించుటలేదు. కావున నీవ్యూహమునకు డాపలించి యరదముం దోలుము చూత" మని యుత్తరు నియోగించెను. పిదపఁ బాదాభివందన పూర్వకంబుగ గురుకృపగాంగేయుల పదనికటంబుల నిలువ రెండేసి బాణంబులును, కుశల పరీక్షారూపంబుగఁ గర్ణంబుల నొరసికొని పోవునట్లు రెండేసి యమ్ములను విడిచి ముందుఁజనియెను. పిదప ఘోరయుద్ధము ప్రారంభమయ్యెను. ఈయుద్ధమాద్యంతము వర్ణింపఁబూనుకొనిన గ్రంథవిస్తరంబగును. దానినంత వివరముగఁ వర్ణించుట మాపనిగాదు గావునను గుప్తముగనైన వర్ణింపకున్న నిష్టార్థసిద్ధికి భంగము గలుగును గావునను నట్లు గావించెదము. ప్రప్రథమమున నర్జునుఁ డుత్తరునకుఁ గౌరవ వీరులను వేర్వేఱ నిరూపించి చెప్పెను. తరువాతఁ బ్రసరిల్లిన సంకుల సమరంబునఁ దొలుదొల్తఁ జిత్రాంగదప్రభృతికురుకుమారులను నిర్జించి, పిదపఁ గర్ణునోడించి, ద్రోణాచార్యున కాయాసంబుగలిగించి, గురుపుత్రుండగు నశ్వత్థామనోడించి, కృపాచార్యునకుఁ గూడ వెట్టఁబుట్టించి, తాతయగు భీష్ముని వృద్ధత్వమును బ్రత్యక్షముగ నిరూపించి, దుర్యోధనుని మానము నెడల్చి తనసోదరుల ప్రతిజ్ఞల నూహించి యొంటుసేయఁ దెంపువహింపలేక "ధార్తరాష్ట్రుల భంగపెట్టఁదలంచి యింద్రదైవత్యంబును సత్యసంవాదనంబును నరాతిసైన్యదైన్య సంపాదనంబును నగుసమ్మోహనాస్త్రంబు" వలన రిపువీరుల నెల్లర మూర్ఛవోఁగొట్టె యుత్తరమాటలను దలంచికొని యుత్తరుంజూచి "యాకౌరవసైన్యము

# ఉత్తరకుమారప్రజ్ఞ:

వారలఁ జైతన్యము వహింపకమున్న వేఁబోయి రారాజు దుర్యోధనుండును గురుపుత్రుండును జుట్టిన నల్లతలపాగలును, గర్ణుఁడుచుట్టిన పచ్చని తలపాగయును, ద్రోణాచార్యుఁడును కృపాచార్యుఁడును జుట్టిన, తెల్లనితలపాగలును దెమ్ము. భీష్ముండీయస్త్రమునకు మాఱుంగును గాన నాతని చెంతంబోకు'' మని నియమించెను. వెంటనే యర్జును నాజ్ఞాప్రకార ముత్తరుఁడు కౌరవయోధుల యుష్ణీషములం గొని తెచ్చెను. కొంత తడవునకుఁ గౌరవులకుఁ జైతన్యము గలిగెను. అప్పుడు తెల్లబోయియున్న దుర్యోధనులజూచి నగుచు భీష్ముఁడిట్లనియె. "మహావీరుఁడనని గర్వించియున్న నీవు నీశిరోవేష్టనము పోవుటయైన నెఱుంగవు. అర్జునుండు దయతో విడువకున్న మనకంఠములన్నియు నిప్పటికిఁ దెగిపోయియే యుండును. ఇఁక నేఁటివిజయము? లెమ్ము పోదము''

పిదపఁ గౌరవబలంబెల్ల చిక్కు మొగముతో బయలుదేఱెను. అర్జునుఁడు గొంతత్తి పోయివచ్చెదనని చెప్పి గురుకృప భీష్ములకు వందనములు గావించి యుత్తరుని జూచి "పసులుమరలె. శత్రులుఁ బాటిపోయి రిఁకఁబోద'' మని చెప్పి మత్స్యనగరాభిముఖంబుగ నరదంబు దోలించెను. పిదప నాట్యశాలలో సఖీజన పరివృతయై యున్న యుత్తరచెంత కరిగి "కురువీరుల యంబరములు బొమ్మపొత్తికలుగా నుపయోగింపు'' మని యిచ్చెను. ఈవిధంబున నుత్తరకుమారప్రజ్ఞ పరిపూర్తియయ్యె:



# యువనసుందరి.

గ్రంథకర్త, మల్లిడి సత్తిరెడ్డిగారు.

---

ఇదియొకచక్కని నవల. ఇందలికథ రాజమహేంద్రవరమునఁ దురకలపరిపాలనము సేయుటననుసరించి యత్యద్భుతముగఁ గల్పింపఁబడినది. ఒకహిందూసేనాధిపతిని మోహించిన యువనసుందరి చరిత్ర, నిర్మలము, నిర్గళము నగుయువనసుందరిప్రేమ, తురకల దౌష్ట్యములు, హిందువులపరితాపము, మున్నగునవి చక్కఁగను బ్రకృతిసిద్ధముగను వర్ణింపఁబడినవి. చక్కనిశైలి, మృదుమధురము, నిర్దుష్టము, ధారాళమునగు భాష, చక్కని యక్షరములతోఁ దళతళలాడు దళసరి కాగితములపై ముద్రింపఁబడినది.

వెల తపాలాకూలిగాక రు. ౧—౦—౦.

వలయువారు:—

మానేజరు, కళాభివర్ధని,

రాయవరము,

రామచంద్రపురము పోష్టు,

గోదావరిజిల్లా, అని వ్రాయవలెను.

# శ్మశాన వాటిక.



అత్యద్భుత కథా కల్పనా విలసితమై మనోహర వర్ణనా బంధురమై సముదాత్త భావ పూరితమై మనోజ్ఞ పద లలిత మగు నిర్దుష్ట భాషలో వ్రాయఁబడిన యొక చక్కని నవల. ఇందలి కథ ము న్నొకప్పుడు గోదావరి మండలమున జరిగిన యొక బందిపోటు ననుసరించి వ్రాయఁబడినది. మనోవికాసము ప్రాపించి జ్ఞానము నొదవించు నీ నవల ముత్యములఁబోలు నక్షరములతో వెండి రేకుల వంటి కాగితముల మీఁద ముద్దులు మూట గట్టునట్లు ముద్రింపఁ బడినది. ఇదివఱకు నాంధ్ర భాషలో మనోహరము లగు స్వతంత్ర నవలలు రెండు మూఁడింటి కంటె నెక్కువ లేవు. వానిలో నిది యొకటి. ఇందలి ప్రధాన పాత్రలలో నెన్నఁదగిన ప్రసాద రాయని తెలివి తేటలును శక్తి సామర్థ్యములును భుజంగ రాయని కుట్రలును చదువరుల కొడలు జలదరింపఁ జేయును. వేయేల? ఇందలి చమత్కారము చదివి తెలిసికొన వలసినదే గాని వివరింపఁ దరము కాదు. కొలఁది ప్రతులు మాత్రమే యున్నవి. త్వర పడినఁ గాని చిక్కవు. ఇదే సమయము.

వెల తపాలా కూలి గాక ఒక రూపాయి మాత్రమే.

వలయు వారు;—

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు.

పొలమూరు, అనపర్తి పోస్టు, గోదావరీ మండలము.

అని వ్రాయ వలయును.

